# Minchupalle - Telugu Polupu

A MODERN POETICAL WORK





*Author:*

**N. VENKATA RAO, M.A.**

# మించుపల్లె—తెలుఁగుపొలుపు

## పద్యకృతి


కృతికర్త:

**నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.,**

ఆంధ్రోపన్యాసకుఁడు, మదరాసు విశ్వవిద్యాలయము

# మున్నుడి.

పండ్రెండేండ్లనాఁడు శ్రీగంటి సూర్యనారాయణశాస్త్రి గారు కల్యాణి సంక్రాంతిసంచికలో నిందుండి కొన్నిపద్యములఁ బ్రకటించిరి. నాల్గేండ్లక్రింద కాకినాడలో శ్రీ పీఠికాపుర మహా రాజా కళాశాలా ప్రథమశాస్త్రపరీక్షావిద్యార్థులు నన్ను బ్రోత్స హించి, యిందుండి యేఁబదిపద్యములుగల కొంతభాగము పుస్తకముగఁ బ్రకటించి, యాప్రతుల నన్నింటిని వ్యయించిరి. నాఁటినుండి యెందఱో దీనినంతటిని ముద్రింపఁగోరిరి. నేఁడు దీనిని పూర్తిగా ముద్రించి ప్రకటించుట కనుజ్ఞయిచ్చిన ప్రస్తుత మదరాసు విశ్వవిద్యాలయాధికారులకు నేనెంతయుఁ గృత జ్ఞుఁడను.

నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.

# తెలుఁగు పొలుపు.

కాచినవాఁడనో యొఱులు కాలిడకుండ నెడందవాకిలిన్
చూచినవాఁడనో యెఱుక సోదన దీవియఁ బుట్టుగుట్టులన్
నేచినవాడనో తెలివి నించెడు వేలుపు బాసపోకడల్
ఏ చదువైన లేక తలయెత్తినకైతకు నెట్టిపేరగో !

మేల్.

# తెలుఁగు పొలుపు.



## 1. తెలుఁగు తల్లి.

ఉ తీరును తీయముం గలుగు తేట తెనుంగను పాలువోసినన్
కూరిన కూర్మిఁ గన్నకొడుకుం బలె పెంచిన తెన్గుతల్లినిన్
గారవ మారఁగా నెడఁద గద్దియ కొల్వొన మిన్కుఁబూలకై
వార మొనర్చి కైతకద లారతి నిచ్చెద నింపువేడుకన్. 1

ఉ. కానఁగరాని పేర్మిఁ దన కమ్మని పాలను సింగరించి పూఁ
దేనియ యుగ్గుఁబట్టి తమిదీరఁగ జాజుల తొట్లఁబెట్టి జో
జో ననుఁ గన్నతండ్రి యని జోడగు కోయిల పాటపాడుచున్
తానయి పెంచు నా తెనుఁగుతల్లినిఁ గొల్చెద నెల్లవేళలన్.2

ఉ. ఏయమఁ జూడఁగాఁ దలఁపు లెక్కటి చిక్కులదారి నేఁగఁగా
నాయన! రార! తొల్లినుడి నంటులు సొంటులుఁ గల్గుప్రాఁబడిన్
బోయితి వంచు క్రొందెనుఁగు బువ్వను కబ్బపు పైఁడిగిన్నెలో
నే యమఁబెట్టు నాయమకు నింతల నంతలఁ గేల్మొగిడ్చెదన్.

ఉ. వ్రాయలవెల్లఁ బండికయి వ్రాలఁగ, నేరుపు కూర్పు పోకడల్
వా యలవెల్ల నిండి దయివాఱఁగ, మేటి తలంపు రాసులన్
తీయని వాకిళుల్ వెలికిఁ దీసి యొసంగిన తెల్గుతల్లినిన్
తీయని కైతకానికలఁ దేపకుఁ దేపకుఁ దెచ్చి మ్రొక్కెదన్.4

చ. ఒడలి కుదుళ్ళలోన నసలొత్తిన పెన్నుసురైన మొల్క దా
కడకువ నెండ సీతునను గాలిని చూపులసోఁకులందు నొ
నిడుములఁ జెందకుండ తమినేచి తనర్చఁగ, పూలుపిందియల్
పొడమఁగ మ్రాని గట్టి తనముం గనఁజేసెడు తెల్గుతల్లియున్.

చ. నెనసిన కూర్మిచేఁ జెమరు నెత్తురుఁగా నొడలెల్ల కన్నులై
యొనయఁగ, పెంపుసేయ నొడలెల్లను చేఁతలుఁగాఁగ, పేర్మిమై
నెనసిన యట్టు నిల్వ నొడలెల్ల నెడందఁగఁ దోపఁజేయు నా
యనుఁగు తెనుంగుతల్లి తనియం గని సేయుత తెల్గువారసిన్.

## తెలుఁగు కైసరి.

చ. ఎడములనాఁగి, సూదిమొనకించుకచోటిడ రాక, యొక్కటన్
కడలకు నొత్తి, గాలిగలె కంటికి సందక, మింటిపోలికన్
నిడివి వెడల్పులేని యొకసిందుతనర్చున నొప్పువేలుపుం
బొడవు లెఱుంగునట్టి నెఱపోఁడిమిఁ దెల్పిరి తెల్గుకైసరుల్. 7

చ. పలుకులఁ జెప్ప, చేతలనుఁ బట్ట, తలంపుల నిల్వరింపఁగాఁ
గొలఁదికి మీఱునట్టి వెలుఁగుం బొడవెల్ల తెనుంగుమాటలో
గొలఁదికిఁ దెచ్చిమింటి మెఱుగుం గలవేలుపు చేఁతలన్నియున్
గలుగఁగ జేసి రీ తెనుఁగుఁ గబ్బపుటద్దమునందు కైసరుల్. 8

ఉ. లోచన వందు చూపులకు లోవెలిఁ గానని వెల్గుదీవియన్
వాచను వందగాఁ దెలుఁగు వాకిట నెత్తినవారు, కబ్బముల్
వాచవి తేనెచే నెఱుక వల్లియఁ బూచిన పూవుటెత్తులన్
దూచినవారు, పల్కు చెలినోములపంటలు, తెల్గుకైసరుల్. 9

ఉ. కో యనునాఁటనుండి తన క్రొంజవు లెల్లను కొల్లఁగాఁగ మీఁ
కో యన కైత క్రొన్నెలలకున్ నెలవో నెలమాయిగున్నపై
కోయిల కైసరుల్ చివురు కుత్తుక నొత్తుచుఁ బాడి రింపుగా
తీయన తీయనై వలపుఁ దేనియ లూఱు తెనుంగుతోఁటలోన్.

ఉ. ప్రాఁతయుఁ గ్రొత్తమేలికలకంబులఁ గూర్చిన కొల్లఁబోఁతఁగాఁ
చేఁతలలోన క్రొమ్మెఱుఁగు చేవలు నించినవారు, మోముపై
వ్రాఁతలలోన గల్గు నెఱవంకలు దిద్దినవారు, పుట్టుతోల్
కూఁతకు నూఁతలై సుతినిఁ గూర్చెడువారు తెనుఁగుకైసరుల్.

ఉ. ఊపిరితిత్తిచే నురువు లూఁదినవారలు, మింటి యింటికిన్.
దాపున నిల్వఁగాఁ దలఁపు దాఁకను బెట్టినవారు, డెందపుం
దోఁపిడి కాని తుందుడుకుఁ దూల్చినవారలు; నెంప ప్రోవులో
చేపినవారు, కూరుముల చిక్కనిసాలను తెల్గుకైసరుల్. 12

చ మినుకు మినుక్కురంచు కొడి నిక్కిలి గట్టుచు, మేనిగూటిలో
కునుకు పెడందగుంగియనుఁ గూర్చిన మానియమూలుబొట్టులన్
మనుగడ జోతి డాలెగసఁ జనఁ ద్రోసిరి నిండు వెల్గఁగా
మనుగడ పాత్తమెల్ల పలుమాఱులు విప్పిరి తెల్గుకైసరుల్.

ఉ. కల్ల నిజంబుగాఁగఁ గనుకట్టుచు, కొమ్మిని చిల్లిబొందిలో
కల్లడిగాఁగ నించి తమకం బనునీటఁ, మేని చేనిలో
పొల్లలడంచి, పెన్నుసురుప్రోవులనూర్చుచు, మాఱురూపులై
చెల్లని నాణెముల్ తిరుగఁ జెల్లఁగఁ జేసిరి తెల్గుకైసరుల్. 14

చ. కుమురుగ మింటి వీఁదియగుగుం బడి వేలుపు టొజ్జపజ్జలన్
కొదవడకుండగా నొడలికూర్పుగు పాత్తము నెల్లచక్కఁగాఁ

జదివిన శ్లోకా నిగ్గు వెయి చాయల పాయలు వాఱునట్లుఁగా
నెదగుడి తాన దివియల నెత్తినవారు తెలుంగుకైసరుల్. 15

ఉ గుత్తఁగఁ గొట్టి మొక్కయెడఁగూర్చినవానినిఁజూడరండటం
చుత్తులగుబ్బత్తిపిన్ మెఱుఁగులొత్తఁగఁజూపుచు తెల్గుకైసరుల్
గుత్తపుఁ గట్టుచే నొడలి కూర్పునఁగల్గిన నూఱు రేకులన్
చిత్తరులెల్ల కన్నుదురు చెన్నుఁ దలిర్ప దెనుంగుటంగడిన్.

ఉ. చిత్తరులెల్ల వ్రాసి రజ చేతను కన్నులు గల్గునట్లుగా
నుత్తుల నెల్లఁ జిల్ప రస ముత్య యనంగుగ, పూలపాన్పులన్
కత్తుఁ బోనర్చోన మెరికం గనఁజేసి రసుంగుచేతిచే
పొత్తుం ... న్ బ్రగశుపూపలు గూర్చిరి తెల్గుకైసరుల్.

ఉ ఒంటమి నింగింపు నెసరొత్తుల నాడెడికూర్మి మాటలో
జంటతవంపృణం డుల జాతీనసొమ్ము మెఱుంగువెట్టుచున్
కంటు ... బ వో గ జగాజిగితో కడవన్నె వెప్పుమన్
దండలుగా గ సీతనుఁగు నాటను నిల్పిరి తెల్గుకైసరుల్. 8

ఉ మున్నిడి ... పులెల్ల మినుమున్నుడి వోవని వెల్పుబాసలో
వన్నెల చిన్నెలం దెలుఁగువాడిక గాఁగ నొనర్చి రింపుగా
క్రొన్నన కన్న నేవ నొడగూర్చినవారలు మేలి తెల్వచే
కన్నడగంగును ని నెద కన్నడిఁ జూపిరి తెల్గుకైసరుల్. 19

చ. బ్రదుకును నెత్తపుం బలకపై తగుసారె లాడళ్లి వాకిళుల్
గదియఁగ నన్నెపున్నెములుగా నొడఁగూర్చిన రెండునట్టులున్
పదిపదులైన పెన్నుసుడు పందెము లొడ్డుచు, మేనిపీటపై
పదిలపుజూద మాడు పరిపాటినిఁ దెల్పిరి తెల్గుకైసరుల్. 20

చ. వలపులు నించునట్లు చలువల్ వెదఁజల్లెడు పండువెన్నెలల్
వలపులు నించి మేనిచెలువంబునఁ దెమ్మెర లొప్పునట్లుగన్
నిలుకడఁగల్గి క్రొమ్మెఱుఁగు నేలపయిన్ నడయాడునట్లుగన్
తెలుఁగునఁ జాటుకై తలను దీర్చినవారు తెలుంగు కైసరుల్.

చ. మురువుగఁగమ్మతావులుగములొక్కనుతావులఁగుండివచ్చి, లేఁ
బొరలను ముద్దువెట్టి యెడ పుష్పాడి రాటచి తీయకన్నెకున్
మెరవడి నెల్ల నించి మెలమెల్లఁగ నెల్లర మేలుకొల్పు తె
మ్మెరలు తెనుంగుతోఁట నెలయింపుఁగ నించిరి తెల్గుకైసరుల్.

చ. దిరిసెన పూలపానుపుఁగ, తేనియవాఁగుగ, మించు చల్వరా
యరఁగుగ, పేర్మియూటలనుసంటిన కాలువగాఁగ, కబ్బపుం
సిరిజవరాలి సోయగపు చిన్నెలకు న్నెలవైనయట్లుగా
యరలఁగఁజేసి రితెనుగునందున కైతల తెల్గుకైసరుల్. 23

ఉ. సొన్నపువన్నెదిన్నియల చుక్కలపూఁబొదరింటిలోపలన్
కన్నెమెఱుంగుటల్లికల గట్టితనంబున మించు త్రాళ్ళ చే
క్రొన్నెలవంకకొమ్ములనుకూర్చిన యుయ్యెలలోన మించు చా
ల్గొన్న తెఱంగుతో తళుకుతళుకన్న యూఁగెడు తెల్గుకైసరుల్.

సీ. ఆనక వేలుపుందేనియ తరితీపు
చవి యిట్టిదని చెప్పఁజాలువారు
అంటక తొలుకారు టందంపు క్రొమ్మించు
తళు కిట్టిద యటంచుఁ దెలుపువారు
చూడక యెల్లరఁ జొక్కించుమరు మించు
సొగ సిట్టిద యటంచుఁ జూపువారు

వినకయ చదలేటి వెల్లువలోపలి
జలజల యులివునుఁ దెలుపువారు
మూఁడురూపుల మొదలైన మొదటిరూపు
పలుఁకువలు మించ నెదయును పలకమీఁద
చిత్తరువువ్రాయు వన్నువ చేవవారు
తెనుఁగు కైసరులను తలఁపునకుఁ దెత్తు. 2

సీ. విలువఁగట్టినవారు వేల్పుటంగళ్లలో
నిలవైన తొమ్మిదినెలలపంట
వెలుఁగఁజేసినవారు పినువీటివీదిలో
కబ్బంపు లనియెడికాగడాల
అఱుఁగఁదీఁసినవారు తఱచైనకైతనా
దలముగుగందంబు తలపుసాన
మెఱుఁగుఁబెట్టినవారు మేలు వేలుపుసొమ్ము
తరకటింపుల మేలి యొరయికలను
అలఁతి పలుఁతిఁగ, నిండునందులను, లోన
వెలిని బయలున నెక్కటి వెలుఁగు నెల్ల
పలుకులో నిల్వరింపఁగ పలుఁతులైన
తెలుఁగుకైసరులను తలపులకుఁ దెత్తు. 2(

సీ. ఆణిముత్యాంతో నలవేల్పుతేనెతో
మంచుతో, మేటిరాయంచతోడ
పాలతో, పెన్నగరాంతో, వెన్నెల
టాలుతో కొన్నెలరాలతోడ

చుక్కతో, కపురంపుముక్కతో, జేజేల
యిక్కతో, మంచులచక్కితోడ
నవ్వుతో, విరిమల్లెపువ్వుతో, తెఱగంటి
బువ్వతో పలుకుల యవ్వతోడ
నీటితోడను పాలమున్నీటితోడ
వెండితోడను, నలవెండికొండతోడ
తెలుపుగలవాని నెల్లను గలయఁగూర్చి
తెలుఁగుకైసరి తనపేరు తెలుపుకొనును. 27

## తెనుఁగు కబ్బము.

సీ. నిండువెన్నెల తెలినిగ్గంత యొక్కచో
కరువునఁ జోసెడు గట్టితనము
పాలమున్నీటపైఁ బడునలలను దెచ్చి
గండరు వోనరించు నిండుదనము
పలువన్నెరూపురేకల నుట్టిపడునట్లు
చిత్తరువులు వ్రాయుచేవఁదనము
విన్నువాఁకఁ జెలంగు పెన్నురువంతయు
నొక్కరూపునఁ జేర్చు నోఁపుఁదనము
చూచినదియెల్ల నొకక్రొత్తసొగసుఁదోప
చూడనిది యట్లు చూపెడు నూటిదనము
తెనుఁగుమాటల నిమిడించు తెఱపుగనిన
కైసరులకబ్బములు తొల్లి వాసి గాంచె. 28

చ. జిలిబిలిసేఁత లొంటికడునిగ్గులు తగ్గులు పేరజంపుట
గ్గలికలు, వింతవింత నెఱగారవముల్, నెఱజవ్వనంబునన్
కులుకుమెఱుంగుఁజూపుతళుకుల్ బెళుకార తెలుంగుకబ్బముల్
పొలపములై నక్రొత్తవఁపుల్ తలఁపుల్ సొలపుల్ వెలార్చెడిన్.

క. నుడులబెడంగును, నడకల
యొడికము, వడివడితనంబు నడివోవనిరూ
ర్పడరించు చదువుచదురును
కడివోవని తలఁపు తెలుఁగు గబ్బపుఁదొడవుల్. 30

ఉ. ఏను తెఱంగు టించులకు నెక్కటి తీపులు, రెండునాల్గులో
దేనియలెల్లఁబట్టి పడఁ దేర్పలు, కమ్మని యూర్పుదావికిన్
పూనకముల్ తెలుంగుపొలుపుంగలగబ్బము లెల్లయొప్పెడిన్
జానగుపల్కుచాన యరజాఱుసిగన్ విరజాజిపూవులై. 31

ఉ. గాణాలు కైసరుల్ తెనుఁగుకైతల తీవెలసూటి మీటుచో
గ్రేణి యొనర్చుచుం బలుకరింపుచు నుండు తెనుంగుకిన్నరల్
రాణఁ దలిర్ప, పల్కుజవరాలి మెఱుంగు తుఱంగలించునో
డ్డాణపుపైఁడిమువ్వలఁగడల్కొను మువ్వములైనసవ్వడుల్,

ఉ. ఆణిమెఱుంగులౌ తెలుఁగుటందపువ్రాలను గ్రాలుజిల్గులన్
పోణిమి మీఱఁగాఁ దలఁపుబొందున, గంటపుసూదికుట్టుచే
రాణను పల్కులేమ తెలిరంగు సురంగుచెఱంగునందు సూ
యాణముగాఁగఁ గబ్బముల నాదట నల్లిరి తెల్గుకైసరుల్. 33

ఉ. అందము చందముంగలుగు నచ్చతెనుంగు టెలుంగులింపగున్
చెందవ విందుకందు తొలిచిందినచిందులు పల్కులేమకున్

కుందును కందు లేని తళుకుందనమందిన కుందనంబునా
నందియలందు పొందికల నందిన దందడులైన సంగడుల్. 34

ఉ. నాలుగు త్రోవలైన పదునాలుగువిద్దెల పూవుఁదోఁటలో
వేలుపు బాసచెన్నలను జపింగొను దోరపుబండ్లు, మేల్పువుల్
జాలయినట్టి కబ్బముల జక్కగ లెన్న తెనుంగు గబ్బముల్
వేలుపుబాస పాల్కడలి వెన్నలుగా వాఁ తలంచి చూడఁగన్.

చ. నెఱతన మొప్పగాఁ మనికి నిండు తనంబును యూపుకోపులన్
కఱ విడిపోవఁగాఁ దెనుఁగు గబ్బపుటద్దమునందు చూపుచున్
తెఱపి యొకింత లేని పిను వెన్నున చుక్కల లెక్క వెట్టెడిన్
ఎఱుకువమీఁద గాక తలమే తెలియంగ తెలుంగుకైసరిన్. 36

క. చవిలేని బ్రదిమిపండ్లను
చవు లూరెడునట్లు చేసి జగముంగడిలో
తపినవెలజాడ గనఁగా
కవి చేసెడు గాదె తెలుఁగుకైసరి యొప్పున్. 37

## తెనుఁగు బాస.

సీ. తీరుతీయంబులై తేట తెల్లంబులై
చెలువాఱునట్టి చిల్కపలుకు
ఆణిముత్తెంబులై యుపరంజిమున్నలై
కనుపట్టువ్రాల చొక్కపు మెఱుఁగు
ఉడివోనినుడువులై కడివోని తెలఁగులై
పోడిమి మించు కూర్పు తెఱంగు

చదువుల కుదురులై చదురుల కిరవులై
పాటిల్లు తోఁటకబ్బపు హాఱంగు
పుట్టతేనియపోలిక నిట్టలంపుఁ
దీయఁదనమున బాసలదీటు గనక
నాఁటుపలుకులలోపల నాడెమైన
తెనుగుబాసయ మాకెల్ల తెలివు నించు. 38

౯. దినుసులందెల్ల మిగుల మెత్తనివి పూలు
పూల మెత్తన దిరిసెనపూవు జాతి
దిరిసెనముకన్న మెత్తన తెనుఁగుబాస
తావి యుడిగాదె మెత్తని తావులకును. 39

## తెనుఁగు కైత.

౬. చదివినకొలఁదియు చవులూఱఁ జేసెడు
పలుకుచే బొట్టునీనులకు విందు
నాఁటినకొలఁదియు న్నాటలకూరుపు
నోడఁగగుర్పాటు నొదవఁ జేయు
తెలిసినకొలఁదియు తెలివి వెల్గును నించి
మఱకువ చీకటిమాయఁ జేయు
తఱచినకొలఁదియు. దలఁపుతీపుల నించి
హాయిదా నెదకుఁ బెంపారఁ జేయు
వెన్నెలం దేల్చినట్టుల, విన్నవాఁక
నీట వ్రాల్చినయట్లు, పన్నీరు జల్లి
కప్పురము గప్పినట్టుల, గడనమీఱు
తిరుగల్గిన దొకటి మా తెలుఁగుకైత. 40

# మించుపల్లె



ఆ. వె. అనఁగ ననఁగ నొక్క యగ్రహారంబులో
బాపఁ డొకఁడు లేమి బాపురోఁ అను
నేస్తు నాశ్రయించి యేసుఁ గెక్కినయంత
సిరినిఁ బొందె దానిఁ జెప్ప వాఁడ. 1

ఉ. శ్రీరమణీయమై పుడమిచేడియ దాల్చినయాణిముత్తెపుం
జేరనగం గళింగమునఁ జేరనఁ బెంపగు లాంగలీనదీ
తీరమునందు నాలం దనివితీరని సంపదతోఁ బదమ్ముచిం
తారహితంబు పల్లె జనితాజనతాదురితాపహారమై. 2

చ. సరములఁ గూర్చుముత్తియపుఁజాలులలీలగృహంబులన్నియున్
దిరుగులు లేక నేకగతి తిన్నఁగ నున్నవచూపుమేరఁగాన్
సరి నిరుప్రక్కఁ గాల్వలు డలు చక్కనిదారపుఁ బోగులౌటచేఁ
బరగును మించుపల్లె యలపంటవలంతి లలంతిపోలికన్.

ఉ. తీరసితోపమానన, సమశీతలతాలఘుతాచ్ఛతాగుణో
దారయు నైన వారిఁ జెలువందు లమిన్నులు దర్గినట్లుగన్
తీరము నిండ యొప్పు నవనీసుతమాతయుఁబోలె జీవనా
ధారము గాఁగ పల్లె కమృతంబు ఘటంబుల నించెనోయన్. 4

చ. తెలియును వారిగోడలును తీర్చుమిద్దెలు, రచ్చపట్టు, పం
చలును నిగారముంగలుగు నల్పుజుటుంగుటుంబులిండ్లలో

మించుపల్లి

కులసతిపూజకుం దులసికోటయుఁ గోష్ఠములాలమందలున్
కలిమి నెలంత కాపురముఁ గాఁగను పట్టుగృహంబులచ్చున్.

క. గాదెయు బోదెయు గేదెయు
వేదనినాదంబు హోమవేదికయాపుం
బూదగుఱు, పాదును, బాదుక
లేదని కన్పట్టుగృహము లేదచ్చోటన్. 6

క. నీరాపనికామెతలై
గారామున పెంపుగనిన కల్పకతరులై
ఆరామ వృక్షములు సీ
తారామునుఁగోరు కన్నుఁదమ్ములపిండై. 7

క. వలరాచవారిధనుశర
ములకల్లైనలకును నిడియ మునుమనఁ జెఱకుల్
దలిరులు, తుమ్మెద లెసఁగెనుఁ
బొలముల నెలమావులందు బూవుందోఁటన్. 8

క. ఊరికి నీశాన్యంబున
గౌరీశ్వరునాలయంబు గన్పట్టును బి
ల్వారామమధ్యమున కర
వీరనాగలింగ పుష్ప వితతులకిరవై. 9

గీ. అగ్రహారంబు నైరుతి నలరుచుండు
సర్వతోముఖయాజియజ్ఞస్థలంబు
దక్షిణంబున పృథులింబవృక్షవాటి
గ్రామదేవత పోలమ్మ కాపురంబు. 10

గీ. రాచ పెన్నాటప్రక్కను రావివేప
గచ్చుగొమ్మను గంటినరచ్చరాయి
పేరుకడలు నప్పనప్రెగడబుగత
గాఁగిలోఁగిలి కెదుటి బంగారుపీఁట. 11

క. మిత్తికి కిఱుమైనపతి సతి
గాత్రముగ చుఁ బసుపుచీరె గగ్గిగ జూపెన్
సత్తెమున కుత్తరంబున
కొత్తపై ముడినాగమాంబ గుండము తనరున్. 12

గీ. పైఁబగ పఁ గీగ్సికట్టిన పఱపుటిండ్ల
పెనుకలోఁ గొత్తనాఁటిన మిరప చేను
కంద, బచ్చలి, నీటిసంగలును, చేమ
పండఁగను దుంపకూర మళ్లుండు మెండు. 13

గీ కాఁకరగను బీర పొట్ల యానఁగాకరయును
దొండ దొండ నేదొండ పండుకొనఁగ
దోసఁ బూఁడువరసంబులు, తోఁటకూర
యాలుగాకములు నచ్చట నలరుచుండు. 14

గీ. పెరఁటి గ్రహాలత్తు నీరాడఁ బెట్టికట్టి
ముదురు నిను చాయపసుపు చెముద్దలనఁగ
నూఱల పళ్లెంబు చెంగటి గోడదగని
నిమ్మలును దబ్బపండ్లును నిండియుండు. 15

గీ అనలఁ గొమ్మలం జెలువారుపాదు
లలముకొనియున్న పందిళ్ల చలువనీడ

ప్రొద్దుపొడిచినతోడనే చద్దికూడు
గుడిచి యాట్లాడుదురు బాలకులు సతమ్ము 16

ఉ. ప్రొద్దున పాలనుం బిదికి బూదలనమ్మలకప్పఁజెప్పి వే
చద్దుల మెక్కి పచ్చికలజాయల సొమ్ములమేఁపుచుం బులుం
బొద్దులు గట్టి నెత్తినిడి ప్రొద్దటు ప్రాలకమున్న గోవుఁన్
దద్దయు తోడి తెత్తురు ముదంబున నచ్చటి యాఁటకాఁరల్.

ఆ. వె. తలకు చుట్టగుడ్డ, మొల గోచి, యొంటట్లు
చెప్పు, పెద్ద బాణ చేతికఱ్ఱ
మంటికడవ, నులకమంచంబు, పూరిల్లు
నూరిగాచునట్టి బోరికకగు. 18

గీ. అప్పసేఁలు చేయమి, గొప్పగొలుకు
తప్పుదాయలు ద్రొక్కమి, ముప్పతేని
త్రిప్పటలు లేనిమనుగడ నొప్పుజనుల
కుప్పతోఁగూడ తొమ్మిదిముంము నచట 19

సీ. అరుణోదయంపు బంగరుచాయపసుపు పై
నిగ్గుల కొకవింత నీటుగూర్ప
మెఱుఁగు లీనంగ దోమిన రాగిబిందియు
భుజ హేమలతికకుఁ బూవుఁగాఁగ
కైవంపునున్న నీర్కావిముడుంగులు
చేదమ్మి కొకవింత చెలువ మెసఁగ
ఒడలంట బిగిగట్టు తడిబట్ట నెమ్మేని
పొంకంబు బింకంబు పొలుపుఁదెలుప

పసుపు పారాణిపాదముల్ పల్లవింప
నడుము లల్లాడ నొయ్యారి నడకతోడ
జలముఁ దెత్తురు పంచయజ్ఞముల కచటి
తలిరుపాయంపుఁగోమిదమ్మలు సతమ్ము 20

గీ. తెల్లకాటుకఁ బోలినకల్లబొల్లి
వెల్లిపూఁతల నెఱుఁగరు వెలుఁగు లచట
మిసమిసల నీవు మైఁజిగి నొసఁగ మెపఁగ
బసను మించెడు నునుఁజాయ పసుపు గాక 21

ఆ. వె. వింత యంచు నొడలు వెల్లడి యగుమంచు
జిలుఁగు వలువ లెఱుఁగ లలఁగబోండ్లు
పడుగు పేక గంజిపదసిడ తెఱచగు
గువ్వయంచు ముతుకకోక గాక 22

ఆ. పుట్టునాటిచెలువు కొట్టుపడిన యట్లు
కట్టు బొట్టు బొట్టు గడనమీఱ
పుట్టి నింటకాలు మెట్టినయింటను
గుట్టు మట్టు మీఱ కొమిరె లుంద్రు. 23

ఆ. వె. ఒడలు నిండబట్ట, మెడనిండ నగలును
కడుపునిండ పిల్ల కలిమిగలిగి
మొగము నిండ పసుపు ముతుక కుంకుమబొట్టు
ఇల్లునిండు నైదువెల్లనిండు. 24

సీ. ముడి ముచ్చటలు వాలుజడల కీకులు లేని
నడుపాపటలచుట్టు జడలబలువు

గీ. లోన సీతును పై వేఁడి మూసుకతన
మండువేసవి నైనను మంచునీరు
మధ్యమధ్యపానీయంబు మాఱుకొనరు
కడితఱిని గొనుకుడినీరుగానిజనులు 29

ఆ. వేళపాళ, వీలుచాలు లే కిచ్చమై
కొనఁగఁ దినఁగఁ ద్రాగ ననువుగాఁగఁ
జేర నచట లేవు చిఱితిండియంగళ్లు
రంగునీటి నమ్ము నంగడులును 30

ఆ. ఉడుపుపైని యుడుపు, యుడుపులో నుడుపును
మెడల, నొడల, తొడల, నడుగులకును
తొడుగు లంటి యుండు తొడుగు లచ్చట లేవు
కడకు నెండ వేఁడి నుడికిపోవ 31

ఆ. తలకు నెండతఱిని తడి యంగవస్త్రంబు
చలికి జమిలినేత జంటబట్ట
మొలకు నేడుమూర్ల ముతుకపంచెల చాపు
గలుగఁ జాలు జన్నిగట్టులకును 32

క. వడిప్రత్తి నిడిచి కదురున
వడికిన రాటంపునూలు పదనిడియల వ్రా
క్కుడుపలక నేఁతబట్టల
పొడమించుచు కట్టువారు పుణ్యులు గారే 33

గీ. మిట్టుపల్లంబులౌ తలమీఁదిజుట్టు
మిగులఁ గాఁ గత్తిరించిన మీసకట్టు

మిం చు ప ల్లె

అపదుగాఁ బోసగింపని యట్టిబొట్టు
గడనసేయునె బ్రాహ్మణగౌరవంబు — 34

సీ. లక్కవెట్టుచు కుండలములలో బంగారు
చల్లఁగా లాఁగు కంసాలి యొకఁడు
మక్కువెట్టుచు మంచిమాని చేవను రూప
డంచెడునట్టి వడ్రంగి యొకఁడు
తుక్కువెట్టుచు మంచిదూదిగాఁ బఱపును
దీర్చెడు నట్టిదూదేకుఁ డొకఁడు
ముక్కవెట్టుచు చర్మమును నెల్ల లాఁగి చె
డావులు చేయుగోడారి యొకఁడు
రొక్కమున కయి నాలుక టక్కువెట్టి
సిక్కమును దాచు సాకిరి యొక్కరుండు
లెక్కకైనను నాయూఁక లేఁడు దాన
నక్కపై చేయినిడి ప్రజ హాయిఁ గంద్రు. — 35

సీ. చేతిజిడ్డంటిన చెల్ల దీరూపాయి
నోటు నాకేలని నూనెవాఁడు
మడిచికట్టిన చిర్గి మాఱ దీరూపాయి
కాకితం బేమని కల్లువాఁడు
కరవాకకోమటి కట్టు కోఁడీబొమ్మ
చీటి నాకేలని సేద్యగాఁడు
'నగముకై పనిచేసినాను యీముద్దర
బొమ్మ నాకేలని పూటకూలి.

కాగితమె గాని రూపాయి కళ్లబడదు
చేయనిక వెచ్చమనుచు మా నాయనమ్మ
యనెడు మాటలు వినఁగరా వచట, విన్న
కంగుకంగను బరువు రొక్కంబుధ్వనులె. 36

గీ. ఇల్లరికి పుల్లరికి గల్లు నల్లరులును
అంగడినిగల్లు చాకలి మంగలియును
ముంగురులుగల్లు బాపన మొగముసిరులు
మందునకు నైన నాపల్లెయందు లేవు. 37

గీ. పచ్చిపసు పల్లమును మాసుపత్రి వసయు
దుంపరాష్ట్రము మొదలి వస్తువులు ప్రోది
గల కుదుళ్లను ముసలమ్మ లెలమిఁ బెంత్రు
పాలపాపల కుపయోగపడు నటంచు. 38

గీ ఎడము లేనట్టి కాన్పు లేటేట గలుగ
కడుపుతీపని కడివోని గారవమున
కడవటికిఁ బెంచుటే గాని కాన్పు మగిడి
యుడుగుతీరు లెఱుంగనియువిద లచట 39

గీ. కడుపు నిండఁగఁ గలుగు దంపుడుల ప్రాలు
ఒడలు నిండంగఁ జాలెడు వడకునూలు
కడవలకు నిండఁగలుగు మీఁగడలపాలు
కడగలుగుపల్లె మనుగడ గనుటె చాలు. 40

గీ. "చదువుసాములు గలిగిన బెదరు లేదు
కదురు కవ్వంబు దిరిగిన కఱవు లేదు

మించు వస్తై

కుదురు కూరిమి గలిగిన కొదువ లేదు
పదుగు రొకటైన నెన్నఁడు భయము లేదు”. 41

గీ. అనెడు మాటలకా పల్లెయందు గలుగు
ప్రజలజీవితసరణి యర్థంబుఁ దెల్పు
దోరసిని గంటమును నొక్కెతీరుగాఁగ
నడపు నప్పనమంత్రి యున్నట్టికతన. 42

ద్విపద ఆపల్లె యొకయగ్రహార మాకథను
ఈపైని వినిచెద నింపుగా వినుఁడు. 43

క. బడిబాపఁడు, గడితేఁడం
గడికోమటి మడినికాపు గలిగెడి తొలిక
ట్టడిచేఁతల నడకలచే
నడరించుంగాదె యగ్రహారం బెపుడున్. 44

క. అడిత్రావుడైన, పఱదల
యెడనైనను, కిత్తు నంటు నెడరున నిడుముల్
ఒడుదొడుకులేని మనుగడ
నడరించుంగాదె యగ్రహారం బెపుడున్. 45

క. తెలినీరును, తలిరాకును
వలితెమ్మెర లెలరువలువ వలసిన కుడుపుల్
తెలినుడులును, తొలినుడునులును
నలరించుంగాదె యగ్రహారం బెపుడున్. 46

క. అడలడివో కడుమే లం
దెడు నాబారాబలావతీ పద్ధతినిఁ

మడి, గుడి, బడి, గడి, సంగడి,
నడరంగాఁజేయు నగ్రహారం బెపుడున్. 47

ఆ. పుట్టువెంపు మాపి పెట్టుపోఁతలవెంపు
పట్టణమున గుట్టుమట్టు చెఱచి
మట్టమునకుఁ దెచ్చు మనుగడ గలుగు దుః
ఖంబులేని యగ్రహార మలరు. 48

---

గీ. ఆ యకరమున బ్రాహ్మల నాయవార
మెత్తి పంచాంగమును జెప్పి, యెట్టులెటులొ
నాలుబిడ్డలపోషణ కలుసువడుచు
లేమి జీవించు నొక్కఁడు సోమశర్మ. 1

క. రోకలిమియు, చేకలిమియు
వాకలిమియు లేనియట్టివాఁ డగుట నతం
డే కలిమికి లెఱుంగక
పైకొలఁదుల పొంతఁ బోక బ్రదిమిం గనుచున్. 2

గీ. ఆయవార మదియ యాదరు వైనను
పంచభిక్షుఁ దుష్టి నించుచుండు
పిలిచి, యాదరమునఁ బెట్టి, వలసినంత
కంటె హెచ్చుగాఁగ నతఁడు గొనఁడు. 3

ఉ. ద్వారమునందు కన్బడినయంత నె లోఁగిలివారు బియ్యమో
కూరయొ, కాయొ, పండొ, తమకుం గలదానిని యాయ
వారమున్, కూరిమిఁబెట్ట దానిఁ గయికొంచును నింటికిఁ

దెచ్చి యిచ్చి సంసారము నీఁడు; పేదఱిమిచాయల నించె
పూరి యింటిలోన్.

చ. తడఁబడకుండఁగా నోరుల తప్పులొ, యొప్పులొ గ్రుక్కఁ
ద్రిప్పకే, బడబడ వాగలేఁ డీఁకను పైకి పటారము లో
లొటారమా, వెడ వెడ మాఱు వేసముల వేయఁగలేఁ; డీఁక
మాటలాడుచో, మడత లెఱుంగలేఁ; డెటుల మన్ననఁ జెం
దెడు బ్రాహ్మణుం డిలన్? 5

గీ. కప్పవిప్ప సమర్థుండు గాఁడు; లేని
గొప్పఁ జెప్పంగలేఁడు, లేకున్న దేహి
యనుచు యాచింపనేరఁ; డెట్లబ్బు సిరి; య
మాయికుండగునట్టి బ్రాహ్మణున కపుడు? 6

ఆ. "ఆలు తలనునాడు నాలుక యగుచుండు;
జాయ నడక నుడులజాయఁ దిరుగు;
దార కూర్పుపూలదారమై, కలియును
దార పాలఁ బంచదారపోలె." 7

ద్వి. అను నుడుల్ వీడని యర్థంబునట్ల
చని మను నాసోమశర్మయర్థాంగి. 8

ఆ. ఇంతిగాన యామె యిలు దిద్దితీర్చెడు;
పొందు విందుసేయు పొలఁతిగాన;
ఒరునిఁ జూడ వెఱచు నుగ్మలి గావున;
మగువ గాన తావి నెగడుచుండు. 9

క. కడచంటిని, నెడచంటిని
కుడియెడముల కొంగు పట్టుకొని పైఁబడుచున్
మెడకాళ్ళఁజుట్టు బిడ్డల
కడు నోరిమి సాకు నామె గంపెండ్లైనన్. 10

ఆ. పాయి నిచ్చి కింకఁ బాయఁగఁజేయును;
కొంగు దరికిఁ జేర్చి గుస్తరించు;
పోరు పెట్టుచుండ నే రీతినో యామె
యూరడించు పిల్ల లొప్పునటుల. 11

ఉ. ఆకులగాని కంచములయం దడరామిని నోగిరంబుఁ దా
నాకులపాటు లేక తినునంతకు మిక్కిలి యోర్మితోడుతన్
ఏకడనైన నొక్కమెతు కెంగిలిఁ గానక యుండునట్లుగా
నా కులపాలికామణియ యన్నము పిల్లలకెల్లఁ బెట్టెడున్.

సీ. కడిచేసి తినఁగ మాఱడుగ నేర్చినచోట
నెంతెంత వలయు నంతంత పెట్టు;
కడిచేయఁ దినఁగ మాఱడగ నేరనిచోట
కడుమెత్తమెత్తగాఁ గలిపిపెట్టు;
కడి చిన్నదైన మ్రింగగ లేనిచోటుల
జాఱుజాఱుగ పెక్కుసార్లు పెట్టు;
కడు కింకపెట్టి యాఁకలి గల్గుచోటుల
ముద్దుసేయుచు గోరుముద్ద పెట్టు;
అడుగఁ బెట్టును గాని చీకాకుపడదు;
అడలఁజేయదు; పిల్లలు కడుపునిండ

కుడువ చే కాలు మూతియు గడిగి మేన
తడియు లేకుండ కొంగున తుడుచు నామె. 13

గీ. ఇంట నున్నను లేకున్న నెట్టులెటులొ
యోరిమిని గల్గి లేమి పై కుబుకనీక
జరపునేగాని తన కెంత జనవునైన
నిరుగుపొరుగులకేఁ గదా యింటియాలు. 14

గీ. నత్త, నావయు నగుచు నున్నట్టి బుడుత
లెల్ల నంతంత నెదుగుచు నేపుమీఱి
కొడుకులును గూతులును నీడువడయ, నింటి
నాయతియుఁగూడ చాలనిదయ్యె నపుడు. 15

గీ. ముద్దు ముచ్చటఁ దీర్పంగ మొదలె లేమి,
పిల్లలకు పెల్లుగానైనఁ బెట్టలేమి
నోర్మి నిల్లాలు నిమిడించు నుమ్మలికనుఁ
జూచి కడు దుఃఖి యగుచుండు సోమశర్మ. 16

ఉ. ప్రేఁకటి నిండుటాలు కను ప్రేఁగయితోఁపగ, బిడ్డలెల్ల వే
రాఁకలిచిచ్చునం దవిలి యల్లన నల్లన నిల్వ, లేమి య
ట్లాఁకలఁబెట్ట నేమెయిని నాఱడియే తను చుట్టుముట్టఁగా
కూఁకటి ప్రేళ్లతోఁ దెగియె గొబ్బున బాపని తెంపుతీవియల్.

గీ. తట్టు ముట్టాడునట్టి పేదఱిమి గలుగు
నింట నెట్లున్న వేగున నేఁగి యాతఁ
డనుదినమ్మును కోనేటి నంచనీట
స్నానసంధ్యాదిముఖ్య కృత్యములఁదీర్చి

మృడుని గుడికేఁగి వలఁగొని మ్రొక్కుచుండు. 18



సీ. అరచందురునిగేరు నళికంబునందున
నెరవైన ముత్తిరునీటిరేక
ఎడమ బుజాన పట్టెఁడు జన్నిదంబులు
నలుతను మేలి రుద్రాక్షమాల
కటిదేశమున పింజెకట్ల గీలించిన
నీడ నారించిన నీరుకావి
కుడిబుజంబున చేతి తడి యంగవస్త్రంబు
డాకేల చిన్ని తాటాకు గొడుగు
చంక పంచాంగమును రాగి సంబెళయును
నలర నీరెండ ప్రొద్దున నాతఁ డేగు
యాయవారంబునకు నగ్రహారమందు
"తేపకడ దోచు భానునిరూపుగాఁగ." 19

క. ఊరిచెఱువునకు నుత్తర
తీరంబున నప్పమంత్రి ధామము తనరున్
మేరువుపూసఁగ నది పెం
పారెడు గృహములకు నగ్రహారమునందున్. 20

ఆ. నింటగాఁగ మ్రుగ్గు లింటిముంగలియందు
గుమ్మములను పసుపుకుంకుమంబు
పచ్చతోరణములు, పాలగచ్చుటరంగు
లెసగు నప్పమంత్రి యింటి కపుడు. 21

ఆ. వె. సోమశర్మ వచ్చి, సూటిగ వాకిలి

గడచి, దేహారంబు గడప నిలిచి
శైవదీక్షతోడ శంభుపూజావస
రైకశీలు మంత్రియప్పఁ జూచె. 22

శా. డంభాచారముగాక, నిక్కముగ షట్కాలంబు ధ్యాన
క్రియఁ, గంభంబై పదునాఱు పూజలను చొక్కఁ ముద్ర
ప్రాంగుండునై, యంభోజంబుల బిల్వపత్రికలుహారానీకముం
గూర్చుచుఁ, శంభుం గొల్చెడు నప్పమంత్రి శివపంచబ్రహ్మ
మంత్రంబులన్. 23

ఆ. వె. అప్పమంత్రి భార్య యన్నమ యతని న
ల్లంత గాంచి, మిగుల యాదరమున
"ఈదినమున మీకు నిచ్చట శివపూజ"
అనుచుఁ దెలిపి చనియె నంతలోన. 24

ఆ. వె. దీక్ష ముగిసినంత ధీయుతుం డప్పన
మంత్రి, సోమశర్మ మనసులోని
కలఁత నెఱిఁగి మిగుల గారవించుచు నిట్టు
లొప్పమీఱ మితహితోక్తి ననియె. 25

మ. ప్రతిసిం గానని శాంతతం గలిగి యార్తత్రాతయై, యింగిత
జ్ఞత, గంభీరత, సత్త్వసంపదను, దుర్గారక్షణ న్మించి, భూ
భృతపూజం గొను దానకుంజరుని ప్రాపుం బొంద నీలేమి ని
ర్గతియా, నమ్మహదాశ్రయమ్మొకటె కర్తవ్యంబుసుమ్మీ సఖా!

గీ. పురుషకారంబు మడిసేయు, పొల్లుపోని
దైవబీజంబు నాఁటు నత్తఱిని; యపుడె

ఏచి వెదవెట్టఁ బండి యభీష్టఫలము
ప్రకటముగ నిచ్చు కర్మహాలికున కెందు. 27

మ. ఫలముం బొందఁగఁజేయు దైవము మనోవాక్కాయకర్మం
బులన్, పలుయత్నంబు లొనర్చునేర్పరికి, సర్వం బర్థముం
గూరఁగా, గలదద్దాన; నెవండు కార్యముల చక్కంజేయునో
వానిముం, గలఁ బర్వెత్తు నదృష్టలక్ష్మి యను వాక్యం బొప్పు
సత్యంబునై. 28

ఉ. చాతకపక్షి దప్పిగొని చల్లనిచిన్కులు రెండో మూఁడో జీ
మూతముఁ జేరి వేడ జలముం ఘనవృష్టిని వర్షించు నా
రీతి వదాన్యశేఖరు దరిద్రుఁడు స్వల్పము గోరఁ జో సం
దాతతసంపదాళి నిడునట్టిదసూ మహదాశ్రయం బిలన్.29

క. పారేతీరం బగు సం
సారాంబుధిఁ గడవఁదరమె చదువనిక్కైనన్
దారాసుతపోషణకును
దారాశయు దానిఁ జేయుదారినిఁ గనుమా! 30

క. ఈవిధి మహదాశ్రయమును
నేవిధముననైనఁ బొంది యారోగ్యదిశన్
వే వీడునట్లు జతనము
తీవరముఁగఁ జేయు; మవల దేవుఁడు లేఁడే? 32

మంజరి. అని చెప్పుచుం డెడియంతలోపలనె
ఓయిరం బంతయు నాయితం బయ్యె
నన విని నల్లింటి కప్పున యేఁగె

మించుపల్లై

చేపట్టు గావించి, చిగురరఁటాకు
నడిమి యీనియ పుచ్చి యొడికంబుగాఁగ
పత్త్రభోజనములు పరగ వడ్డింప
పాత్త్రభోజనముగా భరిత భోజనము
నప్పనమంత్త్రికి నమరఁగా నంత
శివమహాసంకల్పసిద్ధిగా నతఁడు
నాపోశనము లిచ్చి యందరు నపుడు
'శాంతి'ని పఠియింప సజ్జలింగమును
నైవేద్య మొసగి యందఱితోడ నపుడు
సాబంతితోడ భోజనములు దీర్చె. 32

ఉ. వేచిన కందిపప్పు నును వెన్నెలబోలినయన్న మప్పుడే
కాచిన యాలనేయి, కలగాయలఁ గూర్చిన థప్పళంబునున్
వాచవి పచ్చడుల్ పొగపు వైచినకూరలు, నిండుచంద్రుతో
డూచగలట్టి క్రొంబెరుగుతోడను నప్పన పెట్టు నిచ్చలున్.

ఉ. ఉప్పును, చేదు, తీపు పులు పొత్తియును న్వగరైనచాలుగా
గుప్పలు గూరలైన యులుకుం జళు కారెడు పప్పుప్రాలునున్
లప్పలతోడ క్రొంబెరుగులం జిలువాలను, కమ్మ నేతులన్
అప్పన వెట్టుచో నరవయా మెత సామెత పొల్లువోవదే! 34

ఉ. చెప్పఁడు కాని మాట చెవిచేఁ దగుదానిన కాని, భక్తిమై
దప్పఁడు నొక్కపూట తనుదక్కిన వేలుపుపూజ; నీవి చే
ద్రిప్పఁడు నొక్కనాఁట; నరు దెంచినయర్థులు లెక్క మించినన్
అప్పన వెట్టుచో నరవయా మెత సామెత పొల్లువోవదే? 35

మంజరి. అప్పమంత్రియు భోజనానంతరమున
కొలువుసావడి నిష్టగోష్ఠిమై నిలిచి
మానితరీతి తమ్మలములతోడ
దక్షిణ లిచ్చి యందఱే దన్పె నంత 36

గీ. ఒంటిఁగా నుండు నప్పనయొద్ద తనదు
లేమి నుంతేని తెలుపంగ లేదు శర్మ;
ఇంగితజ్ఞుండు నైన మనీషి గాన
నప్పనయు నాతనికి నిట్టు లనుచు ననిపె. 37

క. వాకున మనమునఁ జేతల
నేకుఁడవై దాని నాశ్రయింపుము దానన్
చేకూరు సిరులు నీకు మ
హాకుము మహాదాశ్రయము తెఱంగది సుమ్మీ! 38

గీ. ఆలుమగ లిర్వురైనను నన్ని యెడల
నొక్క మెలఁకువ నడకువ నొనరు టొప్పు;
కనులు రెండైన చూపు లొక్కటనె దాఁకు
కండ్లు రెండైన నిరుసు నొక్కటనె జొట్టు.
అనెడు సూక్తులు సార్థక మైనయట్టు
లప్పనయు నన్నమాదేవి యొప్పుచుండ్రు. 39

క. అప్పనఁగ నన్న మనఁగా
నెప్పుడు వలసినను నప్పు డిడి తా రొకమై
దప్పక మెలఁగుట వారల
కప్పన యన్నమయు నాఁగ సార్థక మయ్యెన్. 40

చ. అనుపమపాత్రదాన వరహస్తిని, గౌరిపదారవిందభ
క్తిని, నిఖిలౌఘశంఖిని, సుధీనుతుఁ డప్పన హృత్సరోజప
ద్మిని యన భర్తతోడ నిలువీర్చుచు నన్నమదేవి దంపతీ
జనముల దేవి దేవరయు జానగునట్లు చరించు నిచ్చలున్ 41

గీ. గుడి, చెఱువు, తోఁట, సల్లిల్లు కొడుకు నిధియు
కృతియు నా సప్తసంతతిఁ గూర్చె నప్ప
మంత్రి యిచ్చె ప్రబంధలు మాన్యులైన
సత్కవులకెల్ల వేమార్లు షకటపముల. 42

గీ. భోగి యెన్నఁగను సతతత్యాగి యగుట
రాగి యెన్నఁగను నిత్యవిరాగి యగుట
యోగి యెన్నఁడు సంసారయుక్తుఁడైన
అస్మితాబుద్ధి లేనట్టి యప్పమంత్రి 43

క. అడుగఁడు; లేదనఁ; డర్థుల
కడ, [illegible], వేలు గవ్వలుగఁ జూచున్
వడుగుల, గొడుగులు, తొడుగులు
మడుగులు వడుగులకు నప్పమంత్రి యొసంగున్. 44

క. ఆ కులపతి నాకుల నా
నాకులపాలికల నెల్ల నయముగఁ దనుపున్
ఆకులు పోఁకలు రూకలు
కోకలు రైకలును పసుపుకుంకుమ నిడుచున్. 45

క. మంతురుల నప్పనయు సీ
మంతినులం దతనియాలు నన్నమయును దా

రెంతయు సౌఖ్యం బుండిన
చింత యొకటి వారియెదల చిరమై యుండున్. 46

ఆ అప్పమంత్రి పిల్లలందఱిలోనను
నన్నతోడఁ బుట్టినట్టి యాడు
పడుచు; ఆమెపేరు పార్వతి జనముద్దు
గాఁగఁ బిరిగె పెంపుగారవమున. 47

ఆ. ఈడు, జోడు చూచి, యిల్లువాకిలి చూచి
చుఱుకుఁదనపుమేలి తెలుఁగుచూచి
అయిన యింటివాని కప్పనప్రెగ్గడ
పెద్దకూఁతు నిచ్చి పెండ్లిచేసె. 48

ఆ. పెండ్లియైనవెనుక పెక్కుదినంబులు
గాకమున్నె వరుఁడు కాశి కేఁగె
స్నాతకమునయందుఁ దా కాశి కేఁగెడు
తీరు నిజ మటంచు తెలియఁజెప్ప. 49

గీ. గడచె నేఁడాది యింకను కాశి కేఁగి
యల్లుఁ డింటికే నేల రాఁడయ్యె ననుచు
తల్లడిల్లిరి పార్వతి తల్లిదండ్రి
పార్వతినిఁ గూర్చి వేఱ చెప్పంగనేల ? 50

గీ. దివములును రేలు వారముల్ తిథులు పక్ష
మాసముల నింకొకేఁడాది మగిడిపోయె;
ఆడుపడు చింట; అల్లుని జాడ లేదు
ఏమి కానున్నదో ముందు నెవరికెఱుక ? 51

చ. ఎసగిన మేనితీవ నవలెత్తుచుఁ దావుల నించునట్లుగన్
పొసగిన నీలిగౌసెనను పుచ్చిన వెగ్గెడు నద్దముట్టులన్
పసనిమెఱుంగులం జిలుకుబంగరునీ రొలికించినట్టులన్
మిసమిసలాడు జవ్వనము మేకొనె కాంతకు నంతకంతకున్

గీ పండువెన్నెల వెదఁజల్లు ప్రాయమందు
తాళిఁగట్టినమగఁ డట్టె తరలిపోయె;
చందురునివంటి మగఁ డెందొ చనియె నేని
కలికి బ్రదుకెల్ల చీకటి గాకయున్నె 53

గీ. దూరమున కేఁగుఁగొలఁదిని తోర మగును
దగ్గఱఁగఁ జేరుకొలఁదిని తగ్గుచుండు
జగమునం దెచ్చటను గనఁ జనని వింత
యగ్గి రాజుచు నుండె నాయతివ మదిని. 54

ఉ. వెగ్గలమైన వింత వెలివేఁకిసెగల్ రగులంగ లోననే
మ్రగ్గెడుగానిఁ దా చలువమందులు దెమ్మన దేరినైనన్
బిగ్గరగాఁగఁ జీఱ దలిబేలుదనంబున నక్కినక్కి తా
నెగ్గతమైనచోట గుణియించుచు నుండు మనోరథార్థముల్.

ఉ త్రోపుడు లాడునట్టి నునుదొంతరసిగ్గులచే నెడందలోఁ
దెపఱుఁదేప కొక్కిమెయి దీకొనునట్టి తలంపువెల్లిదా
నాపగలేదు; పూపవయసైన తలంపులలోని తీపులన్
జూపఁగలేదు; పెన్వలపుసోఁకును దాపఁగలేదు నిచ్చలున్ 56

గీ. జగములో నగ్గిదగ్గఱఁ జనెడుదాని
కాల్చు, దూరాన నున్నచో కాల్ప లేదు;

దూరమున నున్న హృదయవస్తువును గూడ
మన్మథాగ్ని దహించెడు మాయ యేమొ? 57

గీ. సాజముగ రోగ మొకట నౌషధము నొకట
గలుగుచుండును; చిత్రమా చెలువలందు
వలపు వెరవేకి గలిగించువారు వారె
దానిఁ దగ్గింపఁగా నౌషధంబు వారె. 58

ఆ ఎదురుచూచుచుండి రిన్నాళ్లు నన్నాళ్లు
ననక నెల్లవారి నడుగుచుండ్రి
వచ్చుజాడ లేక వెచ్చుచు తలిదండ్రి
పెక్కు దైవములకు మ్రొక్కుకొనిరి 59

ఆ. శకునపతి గాని, స్వరవేది, చేవ్రాలఁ
జెప్పువాని ప్రశ్నఁ జెప్పువాని
అయిన కానివార లందఱ నడిగిరి
ఎవరివలననైన నేమి యనుచు. 60

గీ. కన్యజాతక మెట్టిదో కాని పెండ్లి
యైనమిథునత్వసౌభాగ్య మంద లేవ;
మిథునరాశి నొకప్పుడు మెలఁగకయు న
వగ్రహంబునుఁ జేసె నవగ్రహములు. 61

ఆ. మగనిపేరుఁ జెప్పుమా యని మోదుగు
రెమ్మఁబట్టి కూర్మికొమ్మ లెల్ల
మెల్లమెల్లఁ దాకు మేలంబు లన్నవ
లాకు స్వప్నమందు రాకలయ్యె. 62

గీ. గజపతిక్షితిపరుఁ డేలు కాలమందు
పెల్లు మించు తురుష్కుల తల్లు వచ్చె;
విడిసె నీయగ్రహారంబు వెలిపొలమున
నాయకుం డైన యొడ్డెసేనాని యొకఁడు. 63

గీ. ఎవరివలన నెఱింగెనో యెఱుఁగరాదు;
ఎప్పుడు తనకంటఁబడియెనో యెఱుఁగరాదు;
ఏమి మేలొకో, కీడొకో, యెఱుఁగరాదు;
మన్నె సేనాని యామెపై మరులు గొనియె. 64

గీ లక్షణంబుగ నున్న బాలకినిఁ జూచి
మించుబలిమిని దాను హరించఁదలఁచె;
బలిమి తనదంచు గర్వసంభరితుఁ డగుచు
దణియు మలకలకునుఁ ద్రొక్కఁదలఁచె నపుడు. 64

గీ. మగఁడు నెడలేమి వేఁడిలో రగులుచుండ
వలచె తన్నొక్కఁడను నట్టివార్త వచ్చి
ఎదను సురివెట్టి కలఁచుచు నెఱియఁజేసె
నురులు పుంటిని నెరవిన యుప్పుఁబోలె. 66

గీ ఏక్షణమునైన తనమగఁ డేఁగుదెంచు
నాసయనుజ్యోతి యొకటియ యామె బ్రదుకు
దారి వెలిగించుచుండెను; ధీరమతిని
వలపుటపసడి రాకుండ మెలఁగు నామె. 67

గీ. అంత నొకగాలి కబురుచే నంత యామె
యాస యనుజ్యోతి యప్పుడ యాఱిపోయె

నాఁటినుండియు నెదనేమి నాఁటుకొనెనొ
నోటమాటయు లేకుండు, నీటుదక్క. (8

ఆ మూఁగవోలె నింటి మూలమూలలలోన
నొదిగియుండు, మిగుల బెదరుచుండు
బెదరుతోడ మిగుల బెంగయు మెండయ్యె
కన్నువ్రాంద ద్రొక్క గడియయామె. 69

ఆ. ఎప్పు డెవరివలన నేకీడు మూఁడునో
యంచు కుందికుంది యామె యంత
పేర్మి పోఁగు బిగఁగఁ బెనిచిన బ్రదుకను
కడిద త్రాడు త్రుటిని పుటుకఁదలఁచె 70

క. ఓరిమిని నింతకాలము
హోరాత్రుల గడప నామె కునికి బరువుగాఁ
ఉరెల్ల మాటుమణిగిన
నో రాత్రిని మేనుఁదొఱఁగ నుద్ధియుసేసెన్. 71

ఆ ఇంటిపెరటివెనుక నేతాము నూతికి
ప్రక్కఁ గాలివడనుఁ బట్టి యామె
మలకి సేన విడియు పాలమున కంటిన
కళ్లమునకుఁ జేరె కడిమి మీఱ 72

గీ. కటికచీకటి, అరరేయి, కాలిదారి
బ్రదుకువాఁడిమి నెఱుఁగనిపడఁతి యొంటి
నెట్టు లిలువీడి యేఁగెనో యెఱుఁగరాదు.
కంటివెలుఁగయి, యొడలికి కవచమగుచు

వేల్పుఁ గాఁబోలు ముందఱ వెడలినాఁడు. 73

ఆ. వె. చుట్టు వెంట్లు పెట్టి చూపఱ కొకగడ్డి
మేటునాఁగ; లోన మేనితోడ
నుండి చిచ్చు నొకటనుం దరికొల్పెను
ఎట్టిగుండెదిటవొ యెఱుఁగగలమె ? 74

ఉ నెట్టికసీల క్రొంబసిమి నిగ్గులుదేతెఱు నెమ్మొగంబునన్
బెట్టినబొట్టుతో, ముడియఁబెట్టిన క్రుమ్ముడితోడ మైబిగం
గట్టినచీరె, గుత్తమగు కంచెలతోడను చిచ్చుఁజొచ్చె నీ
పుట్టున మానభంగమునుఁబొందుటకన్నను చావెమేలునాన్.

గీ. భర్తనాడుట నాఁడు సైపకయ కాదె
అల్లసతి మున్ను యోగాగ్నియందు సుడిసె
భర్త లేకుంట పై మాన భంగ మగుట
కోర్వ కీపతి యగ్గిలో నురికె నేఁడు. 76

గీ తొలుత తనకడనుండియే చెలువ వెడలె
గాన కంచెలఁదక్క యాకన్నె రూప
మెల్లలోఁ గొనె, శుచి, లోకమెల్లఁ దెలియ
నామె హృదయశుచిత్వమర్యాద గరిమ. 77

గీ. ఆస్థలమునందు గుండము నమరుచుండు
గుండమును చుట్టుగా నొకక్రొత్తదైన
యూరు వెలసెను; ఈకథ కొప్పునటుల
నదియు కంచిలి యనుపేర నలరుచుండు. 78

---

క. కావున మహాదాశ్రయమును
నేవిధమునైన పొందు మీవను నుడి సం
భావించి సోమశర్మయు
నావఁ దిన్నమాడ్కి లోన నలముటఁ జెందున్. 1

ఆ. అతఁడు పిన్ననాఁడె పితను గోల్పోయిన
కతన నొందువిద్యఁ గాంచలేదు
వడుగునాఁటిమాట వ్యర్థంబుగాకుండ
నాయవారవృత్తి నధిగమించె. 2

మ. కవితాధోరణి లేదు, సంస్కృతము శ్లోకంబేని స్పష్టంబుగా
వివరించంగలశక్తి చాల దిఁక దీవించంగ నాశీస్సు బు
క్కవగాహంబుననుండఁబోదు మృదువాక్యంబేనిపల్కంగ రా
దువదాన్యాశ్రయ మెట్లుజిక్కుతలక్రిందుం జేసి యోచించినన్

మ. నటుఁడైనన్,కవియైన,గాయకుఁడునైనన్ హాస్యకాఁడైన యు
త్కటతర్కేతరవాదకుం డయినగాకన్ రాజసన్మాన మొ
క్కటఁ బొందంగ సమర్థుఁ డెట్లగును చంకం జీర్ణపంచాంగసం
పుటముం జేతిని చెంబు దాల్చు జడవిప్రుండెంతగాఁజూచినన్.

గీ. ఏమిసేయుటకును దోచ కిరుగుపొరుగు
నెదురుగా నున్న పెద్దల కిందఱకును
అప్పనామాత్యుఁ డాడినయట్టిదెల్ల
పూసగ్రుచ్చినరీతిని పొసగఁజెప్పె. 5

ఆ. దానకుంజరుండు దానకుంజరమన
గజమువేల్గు గాన గజము నొకట

మించు పత్తై

నాశ్రయింప నీకు నఖిలసంపద లబ్బు
ననుచు నొక్కవృద్ధు డపుడు చెప్పె. 6

గీ జంతువులను మహీయమై చనెడుకరిని
నాశ్రయించుటయే మహదాశ్రయంబు
అనుచు తనకేమొ యందఱికన్న తెలివి
గలుగునటు లిట్టు లటుచూచి పలికె నొకఁడు. 7

గీ. జంతువులను మహీయమై చనుటెగాక
కర మొకటికల్గు నాశ్చర్యకరముగాగ
హస్తిదానంబు సేయు, విహస్తుఁ డేమి
చేయు, హస్తిని గొలుమని చెప్పె, నొకఁడు. 8

ఆ రెండుకాళ్లుగలుగు బండలకన్నను
నాల్గుకాళ్లబసివి నాడె మెఱుఁగు
ఐదుకాళ్ల జంతు వంతకంటెను మేలు
కొలువుమేను గనుచు పలికె నొకఁడు 9

గీ. అష్టసంఖ్యాప్తి గణనీయమైనకతన
అష్టవిధభోగభాగ్యంబు లందఁజేయు
కష్టమను కోను; ఆశ్రయిఁగమ్ము కరికి
నష్ట మేమని యనె యొక యష్టకుండు. 10

గీ నరులకును వానరులకుఁ గుంజరములకును
నేకరీతిగనుండు మస్తిష్క మనుచు
చెప్పగా వింటి నొకమాట చిన్ననాఁట
తథ్యమని యనుభవుం డగుదశమి పలికె. 11

గీ. స్వల్పమే యబ్బ నరులను నాశ్రయింప
ఏకడను వానరంబు స్వాధీన మగునె
అందలము నెక్కసిరి నిచ్చు నంతలోన
కుంజరుని గొలువు మనుచు నొకఁడు చెప్పె. 12

ఆ. వె. నిజము చెప్పుచుంటి నీదుసంగతియెల్ల
యెఱుకగలఁడుగాన నిట్టిరీతి
యప్పమంత్రి! చెప్పె నట్టుల నొకదాని
నాశ్రయింపు మనుచు ననియె నొకఁడు. 13

మ. నరులంగాంచుచునాశ్రయించుచును బిన్నం బెద్దయున్నాక, నె
వ్వారిగుమ్మమునఁ గుంకుమం బసుపునొప్పం దోరణాల్గట్టి యుం
తురు వారిండ్లకుఁబోయి వేఁడెదును గేస్తుంగాని యూయర్థిముం
దరుగుం బెద్దమ పానకంబు పుడకై యాచించుచో నడ్డమై.

ఉ. వానరజాతిచెల్మి ధనవంతుఁడు నయ్యెను రాముఁ డట్టిచే
వానరనాథుఁడౌ దశరథాత్మజు కబ్బినయబ్బుఁగాక, ఆ
వానరమైన నెంతయు నవారితరీతిని చంచలాత్మ లే
వానరచేష్ట లింకఁ గొలువంగలఁ డెట్టు నభీప్సితమ్ముకై. 15

గీ. నరుల గొలువంగ లేఁడు, వానరులనేని
చేరి యాచించి సుఖపడ నేరఁ డంత
యస్పయామాత్యుఁ డాడినయటులదాన
కుంజరుని యాశ్రయింప చేకొనియె శర్మ. 16

ఆ. ముగురురాయలందు మూఁడవవాఁడైన
గజపతీంద్రు నేనుగలు వసించు

మిం చు ప ల్లై

తోఁటలోన నొక్కతోరంపుదానిని
నాశ్రయించు నాతఁ డన్వహంబు. 17

గీ. ఆయవారమునకు ముందు నచటి కేఁగి
తిథియు వారంబు నక్షత్రవిధులఁ దెలిపి
యోగకరణంబులును విశేషోపరాగ
కర్మకాండనుగూడ నేకరువువెట్టు. 18

గీ. ఎంతకాలమొ యిటు లాశ్రయించుచున్న
వింత గాన్పింపలే దిసుమంతయైన
విసువు జనియింపఁ దొడఁగె నవ్విప్రవరుకు
నైన వీడంగలేఁ డట్టి యాశ్రయంబు 6I

ఉ అంతయొ యింతయో మెవఁడునందున తెల్వియగల్గెనేని యీ
వింత తెఱంగు టాశ్రయపు వేదురు గొందురె ప్రాణికోటి న
త్యంతసమున్నతస్థితిని నందు మనుష్యులవీశి కోతులన్
జంతుల నాశ్రయింతురవె సంచలబుద్ధిని నెట్టిఛాందసుల్. 20

ఉ. పూనికతోడ నాతఁ డొకప్రార్థనుఁ బాయక నావటమ్ములో
నేనిక నాశ్రయింప తనకెందును లాభము లేకపోవఁగా
నేనిక నాశ్రయింప తుద కింతయు నాశ్రము మిట్లుగా గజ
స్నానమువోలె నెంతయు వృథాగతినయ్యెనటంచు నెంచెడిన్.

గీ. ఒక్కనాఁ డంత పెన్మద మెక్కి గజము
కాలిగొలుసుల భూమి నగల్చి త్రెంచి
గీఁక వెట్టుచు నెవ్వరి నాఁకఁగొనక
రేయి జరియించె; తెలవాఱ రివ్వు మనుచు. 22

సీ. ఎఱుకలు గలట్టికొండనా నెసక మెసగ
వ్రేళ్లతోఁ జెట్లఁగొమ్ములఁ ద్రెళ్లఁజేసి
పెళ్లుపెళ్లున కొమ్మల విఱచి యిండ్ల
కంభములు గోడలను నెల్లఁ గలయ నూఁకి
భళ్లుభళ్లున పైకప్పువెల్లఁద్రోచి
పఱచివచ్చెను ప్రజలపై భద్రగజము. 22

ఆ. అగ్రహారమంత హాల్లోహాలంబయి
తల్లడిల్లెనేను గల్లరికిని
పాఱఁ డొక్కఁడొక్క పరువున బాఱుచు
రాజుగారి కెఱుఁగరాఁగఁ జెప్పె. 24

సీ. గజపతియు దెలిసినంత తత్క్షణమె దానిఁ
బట్టగా మావటీలను భటుల నంపె
సంభ్రమముతోడ వార లచ్చటకువచ్చి
కట్టఁగాఁ బట్టఁగా లేక యట్లె యుండ్రి. 25

ఆ. రోజురోజు తా నరుగు నట్లు బాపఁడు
పోవుచుండ; "నేఁడుపోవ నీకు
ప్రాణహానిగలుగు నాలుబిడ్డలఁ జూడు"
మనుచు నచటివార లడ్డుపడఁగ. 26

సీ. వినియు విననట్లు వెడలెడు విప్రుఁ జూచి
"ఇంతకును మేముచేసెడి దేమి నీదు
కర్మ మెట్లున్న నట్లగు బొమ్ముపొమ్ము"
టన్న బాపఁడు వడివడి యరిగి ముందు. 27

గీ. నియతమగు స్థానమందు నేనికను గాంచ
లేక నొకకొంతదవ్వున భీకరముగ
నెదురుపడుచున్న యెవరును బెదరులేక
నెదురుకొనె బ్రాహ్మణుఁ డదె యద నటంచు. 28

గీ. బ్రాహ్మణుని జూచెనో లేదొ భద్రగజము
రోషభీషణ మైనట్టి రూపు మడచి
సహజగంభీరతను ప్రసన్న మగుచు
నట్టె గిట్టున నిలుచు నతివయమున. 29

ఆ వె. ప్రతిదినంబు తనకు పంచాంగమును జెప్పు
నట్టిచోట నప్పు డగుచు నిలిచె
బాపఁ డంతఁ జెప్పె పంచాంగముపు చెప్పి
నంతసేపు నేను గట్లయుండె. 30

ఆ ఆదియు యుగ్రము గాఁగ నాటేని భటులెల్ల
భద్రగజముఁ గట్ట పట్టువడియె
మొదలతోఁక మడచి మూలమూలలపాలు
పిరికిబంట్లు కిరియ వెనపుగాన. 31

ఆ. వె అడ్డమూఁక లేక యాధిత్యమును జూపు
నట్టివాని నెవరు పట్టలేరు
శాంతవృత్తి నుండుసాధుల పేదల
నెవరి పట్ట వీరు లెల్లవారు 32

ఆ ఉత్కృతునకైన పెక్కురుబంట్లచే
పట్టుపడనియట్టి భద్రగజము

"బడుగు బాపనాఁడు గడియలోఁ బట్టెను
చిత్ర" మంచు జనులు చెప్ప, రాజు. 33

గీ సోమశర్మను బిలిపించి సేమ మడిగి
పల్లె కాపద లేక కాపాడితంచు
సంస్తుతింపఁగ ప్రాకృతజనునియట్లు
యుక్తగతి మాని యిట్లు ప్రత్యుత్తరించె 34

ఆ. అప్పమంత్రి యాడినట్టులఁ జేసితి
నంత కాని యెఱుఁగ నన్యమయ్య
అనుచుఁ జెప్ప; నప్పనను బిల్వఁబంపఁగా
రాజు పనుప నతఁడు వ్రాలె నచట. 35

ఆ. నిజము సోమశర్మ నిష్పచ్చరంబున
దోఁగుచుండ నాకుఁ దోచినట్లు
చెప్ప, పట్టుఁదలను చెప్పినదాని, దే
వుని దలంచి చేయుచుండె నితఁడు. 36

గీ. గజపతులు మీరు గాన మీగజమె గాన
ఎంతయో యోరిమిని నాశ్రయింపఁ జూచి
నితని లేమినిఁ బోఁగొట్ట నెంచి తమదు
పాదసన్నిధిఁ జేర్చె నవేదవాని. 37

ఆ. అనుచు నప్పమంత్రి యాడిన నాపల్లె
సోమశర్మ కీయఁ జూచె రాజు
అప్పమంత్రి కాదె యంతయుఁ జేసె నా
చేత యేమటంచు చెప్పె నతఁడు. 38

గీ. గజపతియు బాపని యమాయికత్వమునకు
నెంతయును జాలినొందుచు నిట్టు లనియె
ఇచ్చెదను పల్లె యప్పన కిపుడె, దాన
నెంత కావలెనో గ్రహియింపుమయ్య. 39

ఆ. అనుచు నప్పమంత్రి కప్పుడె యాపల్లె
ధారవోసె, రాజు దత్తిగాన
దాని నప్పమంత్రి దగ్గఱ సగబాలు
ప్రీతి శర్మ దా పరిగ్రహించె. 40

గీ. తనకృతజ్ఞత మంత్రి యప్పనకుఁ దెలుప
శర్మ యాపల్లె నెల్లను శాశ్వతముగ
నకరముగ నూఱుగడపగా నప్పయాగ్ర
హారమనఁజేసె నాచంద్రతారకముగ 41

గీ. ఏనుఁగును నాశ్రయించి దా నింతసిరిని
బొందె గావున గజపతి భూమివిభుఁడు
ఏను గెక్కించి కటక మూరేగఁజేసి
సాగనంపెను తన్నిజస్థానమునకు. 42

ద్వి. పాలుపొంగినయట్లు బాపనియింట
శ్రీలుపొంగెను యశశ్రీ నిండుకొనియె
సరిదీని విని, చెప్పు చదివిన వ్రాయ
[illegible] మంగళమహాశ్రీలు. 43

---